Registered No. HSE-49/2016






# ఆంధ్రప్రదేశ్ రాజపత్రము

# THE ANDHRA PRADESH GAZETTE

## PUBLISHED BY AUTHORITY

**W.No.17** AMARAVATI, SATURDAY , APRIL 28, 2018 **G.48**

**PART II - MISCELLANEOUS NOTIFICATIOSN OF INTEREST TO THE PUBLIC**

--x--

# NOTIFICATIONS BY HEADS OF DEPARTMENTS Etc.,

## REVENUE DEPARTMENT

### (Land Acquisition)

Rc.No. B/34/2018 **ప్రకాశం జిల్లా భూసేకరణ ప్రకటన** Date : 04-3-2018

**ఫారం నెం. VI (ఎ)**

**(2013వ సంవత్సరం 30వ చట్టం వలన భూసేకరణ, పునరావాసం, పున:స్థాపనలలో న్యాయపరమైన నష్టపరిహారం పొందే హక్కు, పారదర్శకత చట్టంలో సెక్షన్ 11(1) మరియు ఆంధ్రప్రదేశ్ నియమావళి 2014లో రూల్ 19, సబ్‌రూల్ (1) ననుసరించి)**

**<u>ప్రాథమిక ప్రకటన</u>**

ఈ దిగువ నుదహరించిన షెడ్యూలు దాఖలా భూములను ప్రజాహిత ఉపయోగార్థం అనగా పూలసుబ్బయ్య వెలిగొండ ప్రాజెక్ట్ క్రింద 7యల్ మైనర్‌లో 14యల్ మేజర్ ఇ5 బ్లాక్ కాలువ నిర్మాణంలోని భాగముగా తర్లుపాడు మండలము గొల్లపల్లి గ్రామములోని కాలువ పోవుచున్నందున శ్రీయుత స్పెషల్ కలెక్టర్ (భూసేకరణ), పూలసుబ్బయ్య వెలిగొండ ప్రాజెక్ట్, ఒంగోలు వారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము భావించినందున, 2013వ సంవత్సరము 30వ చట్టము వలన భూసేకరణ, పునరావాసం, పున:స్థాపనలో న్యాయపరమైన నష్టపరిహారం పొందేహక్కు, పారదర్శకత చట్టంలో సెక్షన్ 11(1) నిబంధనలననుసరించి ఇందుకు సంబంధించిన యావన్మందికి ఇందుమూలముగా నోటీసు జారీచేయడమైనది.

పై పేర్కొనిన చట్టంలోని సెక్షన్ 3(ఇ) మరియు రూల్ 2(బి) క్రింద ఇవ్వబడిన అధికారములను వినియోగించి ప్రత్యేక ఉపకలెక్టరు (భూసేకరణ) పూలసుబ్బయ్య వెలిగొండ ప్రాజెక్ట్, ఆర్ & ఆర్ యూనిట్, మార్కాపురం వారికి, వారి సిబ్బందికి మరియు పనివారలకు ఆ భూముల భూసేకరణకై పై సెక్షన్ క్రింద ఇవ్వబడిన అధికారములను వినియోగించుటకు అధికారము ఇవ్వబడినది.

పై చట్టములోని సెక్షన్ 11(4) ననుసరించి, ఈ ప్రాథమిక ప్రకటన వెలువడిన తేది నుండి శ్రీ ప్రత్యేక కలెక్టరు (భూసేకరణ) అధికారి వారి ముందస్తు అనుమతిలేనిదే, ఏ వ్యక్తి ప్రకటనలో తెలిపిన భూమిని ఏమైన అమ్మకం / కొనుగోలు (క్రయ విక్రయాలు) లేదా ఏ విధమైన లావాదేవీలు జరుపరాదని తెలియజేయడమైనది.

పై చట్టంలో సెక్షన్ 15 ననుసరించి భూసేకరణపై ఏమైనా అభ్యంతరములు / ఆక్షేపణలు ఉన్నయెడల సంబంధించిన వ్యక్తి / వ్యక్తులు ఈ ప్రకటనలు ప్రచురించబడిన తేది నుండి 60 (అరువది) దినములలోగా శ్రీ స్పెషల్ కలెక్టరు (భూసేకరణ) అధికారి వారి ఎదుట అభ్యంతరములు దాకలు చేసుకొనవచ్చును.

## షెడ్యూలు

జిల్లా : ప్రకాశం　　　　మండలము : తర్లుపాడు　　　　గ్రామము : గొల్లపల్లి

| క్రమ సంఖ్య | సర్వే నెం. | పూర్తి విస్తీర్ణం య. సెం. | తరగతి / భూస్థితి | భూసేకరణ క్రింద విస్తీర్ణం ఎ. సెం. | సంబంధిత ఆసామీ పేరు (పట్టాదారు) మరియు చిరునామా | సంబంధిత ఆసామీ పేరు (అనుభవదారు) మరియు చిరునామా | సరిహద్దులు ఉత్తరం | దక్షిణం | తూర్పు | పడమర | చెట్లు మరియు కట్టడముల వివరాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 186/1 | 3.03 | సర్కారు పుంజ | 0.22 | కాగెపోగు సరళ భర్త తోటకూరి శిఖామణి | కాగెపోగు సరళ భర్త తోటకూరి శిఖామణి | 237 | 186/2 | 186/3 | 188 | బీడు |
| 2. | 186/2 | 1.34 | సర్కారు పుంజ | 0.22 | తాడి సావిత్రమ్మ భర్త వెంకటరెడ్డి | తాడి సావిత్రమ్మ భర్త వెంకటరెడ్డి | 186/1 | 184 | 186/3 | 187 | బీడు |
| 3. | 186/3 | 1.82 | సర్కారు పుంజ | 0.21 | ఇతరులు | ఇతరులు | 238 | 184 | 238 | 186/1 | బీడు |
| | మొత్తం విస్తీర్ణము | | | 0.65 | | | | | | | |

**నాగలక్ష్మి. ఎస్.** I.A.S.,
స్పెషల్ కలెక్టరు (భూసేకరణ), (FAC)
పి.యస్. వెలిగొండ ప్రాజెక్టు, ఒంగోలు.

---x---

Published and Uploaded by the Commissioner of Printing, Government of Andhra Pradesh at Government Regional Press, Vijayawada, wwwapegazette.cgg.gov.in